## Bibliographic Record Target

సీతమ్మ, కొటికలపూడి.

అహల్యాబాయి / ఇది శ్రీమతి కొటికలపూడి సీతమ్మచే రచియింపఁబడినది.

1. కూర్పు.- చెన్నపురి : చింతామణి ముద్రాక్షరశాల, 1902.

24 p. :20 cm.

Record no. 304

Sītamma, Koṭikalapūḍi.

Ahalyābāyi / idi Śrīmati Koṭikalapūḍi Sītammacē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Cennapuri : Cintāmaṇi Mudrākṣaraśāla, 1902.

24 p. :20 cm.

Record no. 304

శ్రీ

# అహల్యాబాయి.

ఇది

శ్రీమతి కొటికలపూడి- సీతమ్మచే

రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

చెన్నపురి:

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1902.

దీనివెల ౮ అణాలు.

శ్రీ

# అహల్యాబాయి.

ఉ. శ్రీలు వసింప లోకములఁ జిత్రగతిన్ వెలుఁగొందఁ జేయుచున్
జాలముఁ జేయ కెల్లపుడు సర్వజనుల్ సుఖియింపఁ బ్రీతితోఁ
బాలనఁ జేయురక్షకుఁడు పావనమూర్తి సమస్తసద్గుణా
వాలుఁడు నామదిన్ గలుగువాంఛితముల్ దయచేయుఁ గావుతన్. ౧.

క. హిందూదేశమునం గల। సుందరు లెల్లరును జదివి సుఖియించుటకై
డెందమున భక్తి వేఁడెద। వందితగుణుఁడైన భక్తవత్సలు నెపుడున్. ౨.

ఆ. స్త్రీలు విద్య నేర్వఁ జెడిపోదు రనుమాట। కల్ల యనుచుఁ దోఁప నెల్లరకును
విశదపఱుతు నొక్క విద్యావతిచరిత్ర। సంగ్రహంబు గాఁగ సవినయమున. ౩.

క. వ్రాయఁ గడఁగితి నహల్యా। బాయి యనెడు సాధ్వి చరితఁ బండితులారా
పాయనికృపతో మీ రిట। నేయేదోషంబు లున్న నెంచకుఁ డేవన్. ౪.

క. ఉత్తమగుణు లగుపండిత। సత్తములకుఁ గేలు మోడ్తు సవినయముగ నీ
పొత్తమునఁ గల్గుతప్పులఁ। జిత్తమునం దిడక నన్నుఁ జెలిమి క్షమింపన్. ౫.

సీ. మానినీవిద్యాభిమానులు నాయందు దయ యుంచి తప్పులఁ దాము దిద్ది
స్వల్పవిద్యావతి వనిత పాప మటంచు నను క్షమించెద రనునమ్మకమున
సాధ్వీశిరోమణి సతి యహల్యాబాయిసద్వర్తనము మనసతుల కెల్ల
వినిపింప వారు తద్విధమున వర్తింతు రను నాస కలిగి యీవనితచరిత
వ్రాయఁ బూనితిఁ గాని నే వరకవిత్వ। పద్ధతు లనంగఁ బరఁగెడుబహువిధంబు
లైనవర్ణనలు రసము లాది గల్గు। క్రమముఁ దప్పక వ్రాసెడుకరణి నెఱుఁగ. ౬.

క. కావున నిందలితప్పులఁ। గోవిదులు క్షమింతు రనుచుఁ గొంకక నుది నీ
పావన మయినయహల్యా। దేవిచరిత్రంబుఁ జెపుదుఁ జెలువలు వినుఁడీ. ౭

ఆ. పదియు నేడునూర్లపైని ముప్పదిమూడ। వదగువత్సరమున నుదయ మొంది
రాజ్య మేలె నామె రాణి మహారాష్ట్ర। దేశమందు మిగులఁ దెలివి గల్గి. ౮.

క. వనితామణి గొల్లకులం। బునఁ బుట్టి మహోత్తుఁడైనపురుషోత్తమునిన్
దనమదిఁ గొల్చుచు సద్వ। ర్తనఁ గల్గి చరించె నిట్టితరుణులు గలరే. ౯.

ఆ. కులము నెంచ నేల గుణమె ప్రధానంబు మెప్పు వడయుట కని మీకు దెలుపఁ
దలఁచి చెప్పుదానఁ దరుణిసచ్చరితంబు। సాదరమున వినుఁడి సాంతముగను. ౧౦.

సీ. పూర్వకాలమునందు బొంబాయిదరి నున్న పాథరడీ యనుపల్లెయందు
నానందరావనునట్టిమరాటగృహస్థుఁ డొక్కరుఁ డుండె నాతనికిని
బహుకాలమున నొక్క బాలికామణి పుట్టెఁ గుల ముద్ధరించుటకో యనంగ
వంశపావన యైనవరపుత్రికి నహల్య యనునామ మిడి యతఁ డధికరక్తిఁ
బెంచి సద్గుణములు పెంపొందఁగా మంచిమార్గమందె యుంచి మగువ నెపుడుఁ
దాను జెప్పుమాట దాఁటి చరింపక। యుండునట్లు చూచుచుండెఁ గూర్మి. ౧౧.

క. ఆనందరావుసిందే। చేనిం బండించువృత్తిచే బ్రతుకుచుఁ బూ
ర్ణానందమయుని దేవుని। మానసమున నిల్పి ప్రజలమన్నన వడసెన్. ౧౨.

క. ఆతనిసతియును భువిఁ గల। నాతులలో వన్నె కెక్కినది యై పతికిన్
బ్రీతి జనింపఁ జరించుచుఁ। బాతివ్రత్యంబుఁ గలిగి బహునుతి కెక్కెన్. ౧౩.

మత్తకోకిల. ఇట్టిసత్వగుణప్రధానుల కీయహల్య జనించి తా
నిట్టలం బగుభక్తితోడుత నెల్లవేళల దేవునిన్
బట్టు వీడక కొల్చుచు న్నిజభావమందు నసత్యముం
బుట్టనీక చరించె నెల్లరుఁ బూజ్యభావముఁ జూపఁగన్. ౧౪.

క. అతిబాల్యంబుననే యీ। యతివకుఁ గలసద్గుణంబు లంకురమై స
న్నుతిపాత్రముగ నొనర్చెను। సతతము సజ్జనులు చూచి సంతసమందన్. ౧౫.

ఆ. పువ్వు పుట్టఁగానె పుడమిలోపల మంచి। తావిఁ గ్రమ్ముమాడ్కిఁ దరుణి యైదు
వత్సరములయందె వరగుణోన్నతి నొందె। సత్యనిరతిఁ జూచి జనులు మెచ్చ. ౧౬.

ఉ. బాలిక లెల్లరుం గలిసి వచ్చి యహల్యను జూచి ప్రీతితో
బాలరొ రమ్ము మాకడకు బాగుగ నాటల నెల్ల నాడి వే
లీలలు సల్పి సౌఖ్యముల లెస్సఁగఁ బొందుద మంచుఁ బిల్వ నీ
బాల సుశీల తా మధురభాషలతోడుత వారి కిట్లనున్. ౧౭.

ఆ. చెలియలార నేను శీఘ్రంబ వచ్చెదఁ। గాని యాటలాడు కాలమందు
నైనఁ గాని కల్లలాడఁ గూడదు సుండి। యాడిరేని మిమ్ముఁ గూడ నెపుడు. ౧౮.

క. అని వారికి సత్యమునం। దనురాగము కల్గునట్టు లనుదినమును వా
రిని బిల్చి హితముఁ జెప్పెను। వనితామణిచరిత పరమపావనము గదా. ౧౯.

క. తనతో నాడెడుచెలులను। దనతోఁబుట్టువులపగిదిఁ దలఁచుచు నెపుడున్
వినయవిధేయతతో మా।నిని వారల గౌరవించి నేర్పెను నీతుల్. ౨౦.



ఆ. తరుణి సత్య మెపుడుఁ దప్పకుండుటె కాక। దైవభక్తిఁ గల్గి తనరె మిగుల
నెట్టివస్తువైన నేకేకుఁ గా నెంచి। పూజ చేయుచుండుఁ బూర్ణభక్తి. ౨౧.

క. బాలత్వంబుననే యీ। బాలామణి దైవభక్తిపరురాలై తా
లీలలయందును గరుణా।శీలుని సేవించె నిది విచిత్రము గాదే. ౨౨.

తే. ఇట్టిసుగుణాలవాల యైనట్టిసుతకుఁ। జదువు నేర్పింపవలె నని జనకుఁ డాత్మఁ
దలఁచి యొజ్జలఁ బిలిచి యాతరుణిఁ జూపి। మోద మలరంగ నాతనిమోము గాంచి.

చ. కులగురువర్య మిమ్మిటకుఁ గూరిమితోడుత రమ్మటంచు నేఁ
బిలిచినకార్య మెద్ది యనఁ బ్రీతిని దెల్పెదఁ జిత్తగింపుఁ డీ
వెలఁదికి సర్వవిద్యలను వేగమ నేర్పి సమస్తధర్మముల్
దెలుపుఁ డటంచు నే మిము విధేయత వేఁడుటకై యటం చనెన్. ౨౪.

ఆ. అతివజనకుఁ డిట్టు లాన తిచ్చిన గురుం। డధికసమ్మదమున నతనిఁ జూచి
పల్కె నింత చెప్పఁ బనియేల జదివింతు। నమలహృదయ నీయహల్య ననుచు. ౨౫.

సీ. చదివింతుఁ గన్యను సంతోషమున నేను ప్రతిదినంబును నాదుపాఠశాల
కనుపుఁడి యని గురుం డాదరంబునఁ బల్క నామాటలను విని యాత్మ నలరి
తాము చెప్పినభంగిఁ దరుణి నంపెదనంచు నతని సన్మానించి యనిపె నతఁడు
మఱునాఁటినుండి యీమగువ యొజ్జలయాజ్ఞ శిరసా వహింపుచు శీఘ్రముగను
జదువఁ దొడఁగెఁ బాఠశాలయందుఁ బ్రవర్ధ।మాన యగుచుఁ దనదుమానసంబు
నొండుకోర్కిపైని నుండనీయక యొల।వారు మెచ్చునట్లు ధీరమతిని.

తే. చదువ నేర్చెఁ బురాణముల్ స్వయముగానె। మిగులఁ గొలఁది కాలములోనె మగువ తాను
సీతమొదలుగాఁ గలమంచిచెలుల యొక్క। చరితము లెముఖ్యముగ నెప్డుఁ జదువుచుండు. ౨౬.

క. పాతివ్రత్యంబున వి।ఖ్యాతిని గన్నట్టిపుణ్యకాంతలకథలన్
బ్రీతిని విని వారలయ।ట్లీతరుణి చరింపఁ దలఁచె హెచ్చినభక్తిన్. ౨౭.

ఆ. ఈమెచరిత విన్న నీహిందుదేశంబు।నందుఁ గూడఁ బూర్వమందు మిగుల
విద్య నేర్చినట్టివెలఁదు లున్నా రను।మాట నిజము మనకుఁ దేటపడదె? ౨౮.

తే. ఎన్నరానట్టి సద్బుద్ధు లెల్లఁ గలిగి। రమణి విలసిల్లె సద్గుణరాశి యనఁగఁ
గాని సౌందర్యవతి యామె కాదు సుండు। కాకపోయిన లోపంబు కలదె సతికి?

తే. సత్యమే దివ్యరూపంబు సతుల కిలను। సాటి లేనట్టి సద్గుణసమితి యెల్ల
స్వర్ణమయభూషణంబులై వన్నెఁ దెచ్చు। శాశ్వతానంద మొసఁగును సకియలకును.

ఆ. కాన నీమగువకుఁ గలదు సౌందర్యలో।పం బటంచు నిచటఁ బలుకఁ దగదు
స్త్రీల కుండఁ దగిన మేలైనగుణములఁ। జెలువ ముండెఁ గానఁ జేడియకును. ౩౨.

క. దినదిన మీఁగతి వర్ధిలు। తనయను వీక్షించి తండ్రి తగినవరునకున్
వనిత నొసంగి వివాహం। బొనరింపఁగవలె నటంచు నూహించె మదిన్. ౩౩.

క. తొమ్మిదివత్సరములు గల। యమ్మగువకుఁ బెండ్లిఁ జేయ నెంచినవాఁడై
నెమ్మనమున యోచించెను। గొమ్మకుఁ దగినట్టివరునిఁ గూర్చుటకొఱకున్. ౩౪.

ఆ. కాని తాను ధనముఁ గలవాఁడు గాకుండు। కారణమునఁ జేసి కన్నియకును
భాగ్యవంతుఁ డైనవరునిఁ దెచ్చుట కష్ట।తరమటంచు నతఁడు దలఁచి తుదను. ౩౫.

క. స్థితిపరుఁడు గాక యున్నను। సతతము సన్మార్గపరుఁడు సజ్జనహితుఁడున్
మతిమంతుఁ డైనబాలుని। వెతకుఁడి వరు ననుచు నపుడు వేఁడెను సఖులన్. ౩౬.

క. సామాన్యులవలెఁ గా కీ।ధీమంతుఁడు తనదుసుతను స్థితిపరుఁ డైనన్
బాఘరున కియ్య ననుచును। వేమఱు సద్వరునికొఱకు వెదకుచు నుండెన్. ౩౭.

సీ. ఈరీతి నతఁడు స్నేహితులును సత్సంప్రదాయకుఁ డైన యుత్తమునికొఱకు
వెతకుచు నుండఁగ వెలఁదిపుణ్యంబునఁ బ్రాపించె మంచిసంబంధ మొకటి
యిందూరుసంస్థాన మేలెడురాజైన మల్హారిరా వను మహితగుణుఁడు
యుద్ధార్థమై వేగ నుత్తరదేశంబునకుఁ బోవుచుండి యీనాతి యున్న
పురమునం దొక్కనాఁ డుండి పొలఁతి యొక్క।సుగుణగణంబుల నాయమగురునివలనఁ
దెలిసికొని వచ్చి శీఘ్రంబ కలికితండ్రిఁ। గాంచి యిట్లని పల్కె నాఘనుఁడు ప్రీతి.

ఆ. అనఘ మీసుపుత్రి నస్మదీయకుమారు।నకు నొసంగ నడుగుటకును వచ్చి
నాఁడ వేగఁ దాము నాకోర్కె చెల్లించి। సుదతి నిండు నాదుసుతున కెలమి.

క. అని రాజు పల్కుపల్కులు। విని ఘనుఁ డానందరావు వేడుకతోడన్
దనమనమునఁ దలఁచె నహో। వనితామణి యెంతపుణ్యవతియో యనుచున్. ౪౦.

క. మనమునఁ గల్గినసంతస।మును వెలికిం దెలియనీక మోదముతో రా
జును గని వందన మొనరిచి। యనఘా తమయాజ్ఞ వినుట కర్హుఁడను గదా. ౪౧.

ఆ. తాము చెప్పుమాటఁ దల ధరించుచు నాదు।సుతను వేత్వదాత్మజునకు నియ్య
నియ్యకొంటిఁ గాన నిఁక మీరు శుభలగ్న।మునకుఁ దరలి రండు మోద మలర.

ఆ. అనుచు రాజుతోడ నతివినీతిని బల్కె। తనదుమదిని నతఁడు దలఁచె నిట్లు
వెతకఁబోయినట్టిలత వచ్చి పదములఁ। జుట్టినట్టు లుండెఁ జూడ నిపుడు. ౪౩.

క. రాజసుతునకును సతినై। భూజనసుతయై మదీయపుత్రి సుఖమునన్
రాజభవనమున నుండం।గాఁ జేసినదైవమునకుఁ గరములు మోడ్తున్. ౪౪.

తే. భాగ్యవంతుఁడె కాక యీబాలుఁ డధిక।యోగ్యుఁ డనికూడ వింటి నాయుల్ల మిపుడు
చల్ల నాయెన్ను సద్గుణుం డల్లుఁ డౌట। ననుచు నానంద మందె నిజాత్మయందు. ౪౫.



క. ఆనందరావుసిందే। యానందముతోడఁ జేడె నర్పించెద మీ
సూనున కంచును బల్కఁగ। మానసమున సంతసించె మల్హారిరావున్. ౪౬.

తే. స్థితిపరునిపుత్రి కాకున్నఁ జెలువ మిగుల। నధికగుణవతి కాన నిజాత్మజునకుఁ
దగినసతి యౌ నటంచు నాతండు మదిని। దలఁచి సంతోషమున నేఁగెఁ దనదుపురికి.

తే. అంత మల్హారిరావు తా నరిగి పురికి। బంధువుల నెల్లఁ గన్గొని పలికెఁ బ్రీతి
వినుఁడి శుభవార్తఁ జెప్పెద వేడు కలర। ఖండురావున కొకమంచికన్య దొరకె.

తే. తొమ్మిదేఁడులప్రాయంపుఁగొమ్మ యయ్యు। వన్నె కెక్కెను సద్గుణావళులచేత
వింతయౌనీసుశీలవృత్తాంత మెల్ల। వింటి నచటివారలు చెప్ప వీను లలర. ౪౯.

ఉ. ఈసుగుణాంబురాశి జను లెల్ల నుతింపఁగఁ బాత్రమై సదా
భాసుర మైనసత్యమును బాయక దుర్గుణజాలముల్ నిరా
యాసమునం దొలంగె నని యచ్చటివారలు చెప్ప వింటి నేఁ
జేసినసత్కృతిన్ గలిగెఁ జేడెను గోడలిఁగా గ్రహించుటల్. ౫౦.

క. అని చెప్పి బంధువులతో। జనహితుఁ డానందరావు సదనంబునకున్
జనుదెంచె శుభముహూర్తం।బున వేగమె సుతునిఁ గూడి పొంగుచు మదిలోన్.

సీ. అంత నానందరా వధికసంప్రీతితో వియ్యాలవారికి విడిది నొసఁగి
వారి సన్మానించి వరపుత్రికల్యాణ మరుదెంచె నని చాల నాత్మ నలరి
విధ్యుక్తముగను దా వేగంబ తనయను ఖండురావున కిచ్చి కడుముదమునఁ
బరిణయంబును మహావైభవంబునఁ జేసి తన కున్నదానిలోఁ దనయ కిచ్చి
సుతను బ్రీతితోడ సతియుఁ దానును జేరఁ। దీసి బుద్ధు లెన్నొ తెలుపఁ దలఁచి
యత్తమామలకును జిత్తంబు రంజిల్ల। సేవ చేయు మనుచుఁ జెప్పి మఱియు. ౫౨.

క. పతి యాజ్ఞాపించినపని। సతతము శిరసావహించి సల్పుము తల్లీ
గతి వేఱు గలదె పతికిన్। వ్యతిరిక్తము గాఁ జరించు వనితలకు భువిన్. ౫౩.

ఉ. తల్లిరొ ప్రాణనాయకుని దైవసమానునిఁ గాఁ దలంచుచున్
వల్లభుఁ డాచరించునటువంటిపనుల్ సరిగానివేని నీ
వల్లన మంచిమార్గమున కాతనిఁ ద్రిప్పుచు నేర్పుతోడ వ
ర్ధిల్లు పతివ్రతామణులదివ్యకథల్ పఠియించు చెప్పుడున్. ౫౪.

తే. ఆడబిడ్డలఁ జూడుమీ యనవరతము। నక్కచెలియండ్రవలె నిర్మలాత్మ వగుచుఁ
దక్కఁ గలబంధుజనములదయకుఁ బాత్రు। రాలవై యుండు మమ్మ యోయతివ నీవు.

క. ఐశ్వర్య మున్న దని నీ। వీశ్వరునిన్ మఱవఁ గూడ దెపుడును దల్లీ
శాశ్వతమె యిహసుఖంబు ల।శాశ్వత మౌఁ గాక పరమె శాశ్వతము సుమీ. ౫౬.

క. పరిజనముల నందఱి నీ। వరయుము నిజబంధులట్లు లనవరతంబున్
బరమాప్తు నమ్మి కొల్చుచు। బరిపూర్ణానంద మొంది ప్రబలు కుమారీ. ౫౭.

క. అని యి ట్లనేకవిధములఁ। దనయకు బోధించి రెల్లధర్మార్థంబుల్
జనకులు జను లెల్లరుఁ దమ।తనయల కిమ్మాడ్కిఁ జెప్పఁ దలఁతురు గాతన్. ౫౮.

క. జననీజనకులు చెప్పిన। ఘనబుద్ధుల నాలకించి కడుభ క్తిని వా
రిని గని వందనముల నిడి। వనితామణి శిరము వంచి వగచెన్ మిగులన్. ౫౯.

తే. చిన్నవోయినమోముతోఁ గన్నుదోయి। జలము నింపుచు నోబంధుజనములార
పోయి వచ్చెద నని చెప్పి పొలఁతి మఱియుఁ। జేరి కౌఁగిటఁ జేర్చె నెచ్చెలుల నెల్ల.

ఉ. తల్లియుఁ దండ్రియుం జెలులుఁ దక్కిన బంధుజనంబు లెల్లరున్
దల్లడ మంది చిత్తమునఁ దన్విని గౌఁగిటఁ జేర్చి ప్రీతితోఁ
దల్లిరో నిన్నుఁ బాసి యిఁకఁ దాళఁగఁ జాల మటంచుఁ గుందుచున్
జల్లఁగఁ బోయి రమ్మనుచుఁ జాలఁగ దీవెన లిచ్చి రత్తఱిన్. ౬౧.

తే. అంత మల్హారిరావు తా నరుగుదెంచి। పయనమై పోయెదము నేఁడు ప్రమదమునను
బడఁతి నంపుఁడి యని పల్క వనితతండ్రి। తనయ నంపెను ఖేదమోదములతోడ.

క. భేరీమృదంగములతో। నారీమణి యత్తవారినగరికి వెడలన్
గూరిమి జను లెల్లరును ద।దారవ మాలించి వచ్చి యాశ్చర్యమునన్. ౬౩.

మ. కని సంతోషము నొంది పల్కిరి మహాకారుణ్యుఁ డాదేవునిన్
గొనియాడం దగు బీదవానిసుత నీకొమ్మ న్మహారాజుభా
ర్యను గాఁ జేసెను భక్తవత్సలుఁడె కా యాశ్చర్య మేమున్న దీ
వనితారత్నము ధర్మచింత యిటులై వాసించుఁ బూసత్తిపాన్. ౬౪.

క. సిరితోఁ దులఁదూఁగెడువా। రొరులకు సాయంబు చేయ నోపుదురు గదా
సిరియుఁ బరార్థపరత్వముఁ। గరముఁ గలుగు నేని వారి ఘను లనఁ దగదే. ౬౫.

ఆ. అయినఁ గాని ధర్మ మరయంగ సిరులచే। వెలయువారికడనె విదిత మగు న
టంచుఁ దలఁపఁగూడ దణుమాత్ర మైనను। సిరులు లేమి ధర్మచింత చెడునె. ౬౬.

ఆ. మున్ను హీనజాతికన్నెయా నొకబాల। ధనవిహీన యయ్యు దానశీల
కానఁ బండ్ల నమ్మి కడుబీదవానికి। మేలు చేసి కాదె మెప్పు వడసె. ౬౭.

ఉ. కానఁ బరోపకారు లగుకారుణికోత్తము లెట్టు లైననున్
మానక యర్హకృత్యముల మానవజాతికి వన్నెఁ దెచ్చుచున్
బూని తమంత కష్టపడి పొందినస్వల్పధనంబులోననే
దానము లాచరించుచును ధార్మికులై నుతిఁ గాంతు రెప్పుడున్. ౬౮.



ఆ. అట్లు గాన నీమె యతినిర్మలాత్మయై। యుండు టొకటె కాక నిండుసిరులఁ
గల్గువానియొక్కకాంతాలలామయై। తనరె నీమెఁ బొగడఁ దరమె మనకు. ౬౯.

క. అని యి ట్లనేకవిధముల। ననుకొని నుతియించి రీయహల్యసుకృతమున్
గొనియాడఁ దగదె మనము। వినయగుణాన్విత యనంగ వెలసినయీమెన్.

తే. అంత నిందూరునకు వార లరిగి వేగ। వైభవంబున నిలు సేర వధువు వరుని
వచ్చి దీవించి రచటివిద్వజ్జనములు। పౌరు లెల్లరు నానందభరితు లైరి. ౭౧.

ఆ. పెండ్లి యైనవెనుక వెలఁది నెప్పుడుఁ బుట్టి।నింటి కనుపకుండ నింతిమామ
తనగృహంబునందె యనయంబు నిలిపి తా। నిండుదయను జూచుచుండె నెపుడు.

ఆ. మామగారియొక్కమాట దాఁటక చాల। భక్తిఁ గలిగి యతనిభావ మెఱిఁగి
సంచరించి యీమె సత్కీర్తి వడసెను। సకలజనులుఁ జూచి సంతసింప. ౭౩.

తే. పడఁతి యత్తయౌ గౌతమీబాయి మిగుల। నేర్పుతో గృహకృత్యముల్ నిర్వహించుఁ
గాని కోపస్వభావంబు గలది కానఁ।బరుషవాక్యంబు లెప్పుడుఁ బల్కుచుండు. ౭౪.

క. తనయత్తగారు చెప్పిన। పను లెల్లను నిర్వహించి భామామణి తా
ననయము నాయమచిత్తముఁ। గనుఁగొని వర్తించుచుండెఁ గడువినయమునన్. ౭౫.

ఆ. అత్తగారు మిగుల నాగ్రహించినయెడఁ। దనమృదుమంజుభాష లనుజలముల
నార్పుచుండు నామెయాగ్రహానలముఁ దా। నేమి చెప్పుదాన లేమ నేర్పు. ౭౬.

తే. ఆమెకడఁ గొన్నిదోషంబు లగపడినను। వానిఁ గల నైనఁ దలఁపక వనిత తాను
మంచిగుణ మేదియో యది యెంచి చూచి దానిఁ దా నభ్యసింపఁగఁ దలఁచుచుండు.

ఆ. ఆడబిడ్డ లైనహరకుబాయియు ముదా। బాయి యనఁగ నొప్పుభామినులను
నిష్కళంక మైన నెయ్యంబుతోఁ జూచి। కలసిమెలసి యుండుఁ గలికి యెపుడు.

క. తరుణప్రాయముననె యీ।కరణిని నత్తింట నుండి ఘనత వహింపన్
దర మగునె యితరులకు నీ।ధరణి నహల్యకును దక్కఁ దథ్యము చుండీ. ౭౯.

ఆ. చిన్ననాఁటనుండి చెలువ తల్లియుఁ దండ్రి। విద్య నేరిపించి వెలఁది కెపుడు
నయభయములు చూపి న్యాయంబుఁ దెలిపిన। కతనఁ గాదె కీర్తిఁ గాంచె నీమె.

తే. విద్య నేర్పింప సతులవివేకమునకుఁ। జెడుగు కల్గున టంచుఁ గుచ్చితపుఁదలఁపుఁ
గల్గి చెలుల నజ్ఞానాంధకారమునను। ద్రోయఁ జూతురు గొంద ఱన్యాయమునను.

తే. అట్టిమహనీయులకు నీయహల్యచరిత। సాక్షియై మానవతు లెల్లఁ జదువవలయు
ననుసద్బుద్ధి ముదయించు నటులఁ జేయఁ। దగినదై యుండు నని నేను దలఁతుమదిని.

సీ. ఈగతి నత్తింట నెల్లవారలకడ వినుతు లొందుచునుండ వెలఁది కపుడు
వచ్చెను బదునాల్గువత్సరంబు లపుడు వ్యక్తురా లాయెను వనిత యంత
శుభముహూర్తంబున సుదతిని భర్తనుఁ గలిపిరి పెద్దలు కడుముదమున
నది మొద లంగన యాత్మేశ్వరునియందు భక్తిఁ జూపుచు నిజభావమందు

మాయమర్మంబు లెఱుఁగక న్యాయ్యమతిని। నతనియాజ్ఞానువర్తినియై యనయముఁ
జంద్రమతి సీత మొదలైనసతులమాడ్కి। వరపతివ్రతాతిలకమై వన్నెకెక్కె.

క. ఇంతకు మును పీయమ నిజ।కాంతునిపై నెంత ప్రేమఁ గల్గిన దైనన్
సుంతైనఁ బయికిఁ దెలుపక। స్వాంతమునం దతని దైవసమునిఁగఁ దలఁచెన్. ౮౪.

క. ఇఁకపై జడియక పతిపై। నకలంకం బైనప్రేమ నగపఱుచుచుఁ దా
సకలవిధంబులఁ బతియెడ। నకుటిలమతి సంచరించె నంగన యెపుడున్. ౮౫.

క. పరిచారికాళిచేతను। బరిచర్యలఁ జేయనీక భర్తకుఁ దానే
పరిచర్యఁ జేయుచుండెను। బరమాదర మొప్ప నీమె ప్రత్యహమందున్. ౮౬.

తే. అతఁడు చేయఁబూనినపని కనుగుణముగఁ। దాను బ్రోత్సాహ మొనరించి తరుణి యెపుడు
విభుని సత్యసంధునిఁ జేయ వినయమునను। దైవమును వేఁడుకొనుచుండుఁ దనదుమదిని.

ఆ. కోపమునను నాథుఁ డేపల్కుపల్కినఁ। గాని దానిఁ దనదుమానసమున
నిడక యోర్పుఁ గల్గి పడఁతి తా నతనితో। ననునయంపుమాట లాడుచుండు. ౮౮.

క. క్షీరోదకములకైవడి। నారీరత్నమును విభుఁడు నయమొప్పంగాఁ
గూరిమిని గలిసియుండిరి। ధారుణిజను లెల్లఁ జూచి తగు నని మెచ్చన్. ౮౯.

ఉ. మానిని ప్రాణవల్లభుని మన్ననఁ గాంచుచు నెల్లవేళలన్
మానసమందు నీశ్వరుని మానక కొల్చుచు భక్తిమై సదా
జ్ఞానముఁ గల్గి పెద్దలను సాధుజనంబులఁ బ్రీతితోడ స
న్మానముఁ జేయుచున్ మిగుల మాన్యత నొంది చరించె నెంతయున్. ౯౦.

క. అన్నిగుణంబులలోపల। నెన్నం దగు దైవభక్తి హెచ్చగుటను దా
నెన్నఁడు మఱవక దేవుని। సన్నుతు లొనరించుచుండె సతి కడుభక్తిన్. ౯౧.

క. జపములఁ జేయుచు నిరతము। విపులంబగుభక్తితోడ విగ్రహములఁ దా
నెపుడును బూజించుచు స।త్కృపఁ బేదలఁ గాచి యామె స్థిరకీర్తి గనెన్.

తే. మనుజులెల్ల జ్ఞులగుట నాత్మస్వరూపుఁ। డైనయీశ్వరు నొక్కఁ డా మరయలేక
బహువిధంబుల నూహించి పలువు రాత్మఁ। బెక్కు మతములేర్పఱిచిరి పృథివియందు.

తే. అట్టిమతములలో నెల్ల నాద్యమగుచు। భరతఖండములోపలఁ బ్రబల మగుచు
వెలయు హిందూమతంబందు వెలఁది మిగుల। నమ్మకముఁ గల్గి యుండెను నెమ్మనమున.

క. పరిపూర్ణమైనభక్తిని। బరమాత్మునిఁ గొల్చుచెపుడు భామామణి తా
నరిషడ్వర్గంబుల సుస్థిరమతియై త్రుంచివైచె ధీనుత యగుచున్. ౯౫.

సీ. ఈరీతి జగదీశు నెల్లవేళలయందుఁ గొల్చి యాతనికృపఁ గొల్లగొనియె
సకలజంతువులను సమభావమునఁ జూచె భూతదయారసబుద్ధి గల్గి



తనయత్తమామలు దయతోడఁ దన కిచ్చుధనముతో బీదలఁ దనుపుచుండె
దాసదాసీజనతతిపైని నెన్నఁడుఁ గోపించి యెఱుఁగక కొమ్మ తాను
బరమశాంతస్వభావంబు పరిఢవిల్ల। గర్వవిరహిత యగుచు లోకమున వెలసి
సుగుణముల నేర్వఁ దలఁచెడుసుందరులకు। మగువ మార్గప్రదర్శిని యగుచు నిలిచె.

తే ఇట్లు రెండేండ్లు జరగ నీయింతి తాను। గర్భము ధరించి సూనునిఁ గనియె నపుడు
పుత్రలాభంబు కలుగ నీపొలఁతిమామ। మొదలుగాఁ గలవార లామోదమందిరి. ౯౭.

తే. రాజవైభవ మలరంగ రమణి కపుడు। పురుడు పుచ్చిరి యంతటఁ బుణ్యతిథిని
నామకరణంబుఁ జేసెను నాతిమామ। మాలిరా వని తనముద్దుమనుమనికిని. ౯౮.

ఆ. పుత్రుఁ డుద్భవింపఁ బుణ్యాంగనామణి। సంతసంబు నొంది సంతతంబు
నొరుల కప్పగించి యూరక యుండక। ప్రేమమునను దానె పెంచె సుతుని. ౯౯.

క. తనయునిముద్దులఁ గనుఁగొను।చును సంతోషమున నుండ సుదతీరత్నం
బున కటుపై మూఁడేండ్లకు। జనియించెఁ గొమార్తె బంధుజను లలరంగన్. ౧౦౦.

తే. పెద్ద లందఱాలోచించి ముద్దుసుతకుఁ। బరమసంతోషమున ముక్తబాయి యనెడు
నామధేయంబు పెట్టి యానాఁడువారు। సకలవైభవలీలలు సల్పి రెలమి. ౧౦౧.

క. పుత్రీపుత్రులతో శుభ।గాత్రి మహావైభవమునఁ గాలము గడపెన్
ధాత్రి జనతతికి బిడ్డలు। నేత్రోత్సవ మిడుదు రనుట నిక్కంబు గదా. ౧౦౨.

క. సిరియును సంపద సద్గుణ। నిరతియుఁ గల దగుచు మిగుల నేర్పరియా నీ
గరిత యనిశము సుఖాబ్ధిని। జిరముగ నెంతయును మునిఁగి తేలుచునుండెన్. ౧౦౩.

తే. ఏమిటఁ గొదవ లేమి యాకోమలాంగి। సుగుణసంపద జను లెన్నఁ దగిన దయ్యెఁ
గాన నాపద లనిపి యాకలికిపైకి। వెలఁది ధైర్యంబుఁ గనుఁగొన విధి దలంచి.

తే. పంపెనో యన నాపదల్ పడఁతిపైకి। వచ్చి యలయింపఁ జొచ్చె నీవనిత నకట
మనుజులకుఁ గష్టసుఖములు ద్యూతలమున। సమముగా నుండు ననుమాట సత్యమరయ.

తే. ఇంతవఱ కీమెచరితంబు సంతసమున। నుడువఁ గల్గితిఁ గాని యాపడఁతి కిఁకను
గలుఁగఁబోయెడుకష్టముల్ దెలుపుటకును। గొందలమునొందెడును నాదుడెందమిపుడు.

ఉ. కాని మహానుభావు లిలఁ గష్టపరంపరఁ జెందినప్పుడే
కానఁగ వచ్చు వారలకుఁ గల్గినధైర్యగుణాదు లెప్పుడున్
గాన నమె పూర్వకాలమున గణ్యత నొందినవార లెల్లరున్
గానల కేగుటల్ మొదలుగాఁ గలకష్టచయంబు నొందుటన్. ౧౦౭.

తే. కాన నీమెసుకీర్తి లోకంబునందు। శాశ్వతము చేయఁ దలఁచి యీశ్వరుఁడు సతిని
గష్టములపాలు చేసెను గాన నెపుడు। నీశ్వరుని నిర్దయుండని యెంచరాదు. ౧౦౮.

తే. సకియ యీరీతి సుఖియించుసమయమందు। నువిదమామపై నెవ్వరో యుద్ధమునకుఁ
గాలుద్రవ్వుటఁ జూచి యీకలికి భర్త। తండ్రితోఁ గూడి యనిచేయఁ దరలెనపుడు.

తే. శత్రుసైన్యంబు లధికమౌ చలము మీఱ। ఖండురావును బరలోకగతునిఁ జేసి
రకట తద్వార్త తెలిసినయాక్షణంబ। ముగ్ధ శోకాబ్ధిలోపల మునిఁగె మిగుల.

క. పతితోడిదె లోకం బని। సతతముఁ బతిసేవఁ జేయుసకియల కెల్లన్
బతి నెడఁబాయుటకంటెను। క్షితి వేఱొకదుఃఖ మున్నె చింతింపంగన్. ౧౧౧.

క. తనవిభునిసద్గుణంబులు। మనమునఁ జింతించి దుఃఖమగ్న యగుచు నో
యనఘాత్మ యెచటి కేగితొ। కనుఁగొన రావో యటంచుఁ గడుదుఃఖించెన్. ౧౧౨.

సీ. హా ప్రాణనాయక యరిగితే ననుఁ బాసి నినుఁ జూడ కోర్వ నే నిమిషమైన
నీరాజ్య మేల నా కీసిరు లేటికిఁ బతి లేనియట్టివైభవము లేల
యే నోప సౌభాగ్యహీననై యుండుట కిదె సహగమన మే నిపు డొనర్తు
నని యహల్యాబాయి యనుకొన విని చెలుల్ మల్హారిరావుతో మగువతలఁపు
విన్నవింపంగ నతఁడు వేవేగ వచ్చి। కోడలిని గాంచి బల్కె నోకొమ్మ వినుమి
యాత్మహత్య మహాపాప మనుచుఁ బెద్ద।లనెడుమాట నెఱుంగవే యనుచు మఱియు.

క. అమ్మా సతులకు సహగమ। నమ్మిల సద్గతి నొసంగు నాతిరొ సైనన్
గొమ్మ లకట కాలెదుకా।ష్ఠమ్ములలో దుముకఁ జూడ శక్యం బగునే. ౧౧౪.

ఆ. అది యటుండనిమ్ము ముదితరో నా కొక్క। సుతుఁడు కల్గినేఁడు మృతిని బొందె
దాన దుఃఖ మనెడుదావాగ్నిలోపల। వేఁగుచుంటి నీవు నేఁగితేని. ౧౧౫.

తే. ప్రాణమే భారమౌను నా బ్రతుకు కల్ల। నిలువ మి మ్మిర్వురను బాసి నిమిషమైనఁ
గాన నా మేలు కోరెదుదానవేని। సాహసము చేయ వలదమ్మ సకియ నీవు. ౧౧౬.

క. సుతుఁడు మృతి నొందె ననియే। యతులితదుఃఖాబ్ధి నేనహర్నిశమును నో
యతివ మునిఁగితిని నీ వీ। గతిఁ దలఁచితి వింక బ్రతుకఁ గలనే భువిలోన్, ౧౧౭.

తే. వంశపావనుఁ డైన నాసుతుండు। పోయె నని యాత్మలోఁ గడుఁ బొగులుచుండి
మరల ధైర్యంబుఁ గంటి నీమంచినడత। నరసి నాముఖ్య గడపెద ననుచుఁ దల్లి,

క. పోయిన దె నిజ మహల్యా। బాయి యటంచును దలంచి పాయని ప్రేమో
పాయముఁ గలసుతుఁ డీ వని। వేయివిధంబులఁ దలంతు వెలఁదిరొ వినుమీ. ౧౧౯.

ఆ. కాన నాదుమాటఁ గా దన కెంతయు। నన్ను గౌరవించి నాతి నీవు
బ్రతికి నన్నుఁ గూడ బ్రతికించి యెపుడును। బుణ్యశీల వగుమి పుడమియందు. ౧౨౦.

క. అని పల్కుమామగారికి। వనితామణి భక్తితోడ వందన మిడి తా
వినయవిధేయతతో నా। తనిఁ గని పల్కంగఁ దొడఁగె దైన్యాకృతితోన్. ౧౨౧.



తే. అయ్య నాయందు మీకున్న నెయ్యమునను। బల్కుచున్నారుగాని యీపగిది నేఁడు
కలదె మీ రెఱుంగనిది లోకంబులోన। నైన నాపల్కు లాలింపు డాదరమున.

తే. విభుఁడు పరలోకగతుఁ డైన వెలఁదులకును। గానఁబడు నెన్నరా నట్టికష్టచయము
గాన నార్యులు పతిఁ బాయుమానినులకు। సౌఖ్యకర మని చెప్పిరి సహగమనము.

క. మనలోఁ బతిఁ బాసినయా। వనితలు పడుపాట్లు కన్న వసుమతిలో నో
యనఘ సహగమనమే మే। లని తలఁచెద నామనమున నశ్రాంతంబున్. ౧౨౪.

క. ఘోరనరకం బనం దగు। ధారుణి వైధవ్యబాధఁ దప్పించుటకై
ధీరులచే సహగమనము। నారులకు విధింపఁబడియె నరనుతచరితా. ౧౨౫.

తే. అతివ లల్పజ్ఞురాండ్రు తా మగుట నెపుడు। జ్ఞానచింత నెఱుంగ కజ్ఞాన లగుచుఁ
బతివియోగదుఃఖాబ్ధిలోఁ బడి మునింగి। తేల లేకుందు రనుమాట తెల్ల మరయ.

తే. కాన భర్తృవిహీనలకష్టములను। బాప నేరక యార్య లీపగిదిఁ దాము
బహుదినంబులు యోచించి భావమందుఁ। జేసి రీయుపకారంబుఁ జేడియలకు. ౧౨౬.

తే. శాస్త్రసమ్మత మైనయీసహగమనము। చేయవలె నని యిపుడు నేసిద్ధపడితిఁ
గాని తమయాజ్ఞ వినఁదగుదాన నగుట। మానెదను జూండి నాపూన్కి మాన్యవినుత.

సీ. అని మామగారితో నతివినీతిని బల్కి యాతనియెడఁ గల యధికభక్తి
వలనఁ దా నిలిచెను వైధవ్యదశయందుఁ దరుణి యత్యధికమౌ ధైర్యమునను
నిఖిలలోకేశుని నెమ్మదిలో నమ్మి కావించె లోకోపకారములను
సుఖదుఃఖములయందు సారిది సమానమౌ స్వాంతంబునను నిల్పె సంతతంబు
ధర్మమార్గంబునందు వినిర్మలాత్మ। యగుచు సతి సంచరించునయ్యవసరమునఁ
బుత్రభావంబుతోఁ జూచుపాలఁతిమామ। యకట లోకాంతరంబున కరిగె నయయొ.

క, పతిఁ బాసి నట్టియాపద। నతిచతురత నిగ్రహించి యనుదినమును స
న్నుతిపాత్ర మైనపనులను। సతి చేయుచు నుండ మామ చనెఁ బరమునకున్. ౧౩౦.

తే. ఆపదలపైని నాపద లరుగుదెంచి। యతివధైర్యధనంబుఁ దా మపహరింపఁ
జెలియ యాతస్కరచయంబుఁ జెదరఁగొట్టి। నిలిపె ధైర్యధనంబుఁ దా నేర్పుతోడ.

చ. ఇరువదిమూఁడువర్షములయీడున నెన్నఁగ రానియాపదల్
పరువడి వచ్చి చుట్టినను భామిని జంకక యించు కేనియున్
నిరతము భక్తవత్సలుని నిండుమనంబున నమ్మి కొల్చుచున్
గరము సుకీర్తి నెల్లపుడుఁ గాంచి చరించుచు నుండె నెంతయున్. ౧౩౨.

క, తాతయనంతరమునఁ దగ। నీతరుణిసుతుండు రాజ్య మేల వలసినం
బాతకశీలుఁ డగుట జను। లాతని నేలికగ నొల్ల మనిరి గ్రహింపన్. ౧౩౩.

క. అన విని పూనాపేష్వా। లనవరత మహల్యబాయి నంచితమతితోఁ
   గనుఁగొను ప్రభువులు గావున। వనితసుతుని నేలు మనిరి వసుమతి దయతోన్.

క. ఘనబుద్ధిమంతురా లగు। వనితామణి మిగులఁ గష్టపడు నని ప్రభువుల్
   జనసమ్మతి లేకయె తా। మొనగూర్చిరి యీమెసుతుని నుర్వీశునిగాన్. ౧౩౫.

క. అంతట నీయమసూనుఁడు। సంతసమునఁ బీత మెక్కి సకలజనులఁ దా
   నెంతయు బాధించుటఁ గని। చింతిల్లుచునుండె నీమె చిత్తములోనన్. ౧౩౬.

చ. పరమపతివ్రతామణికిఁ బామరుఁ డౌసుతుఁ డుద్భవించి తా
   నరుల కనేకకష్టము లొనర్చుచు మాత యొసంగుబోధలన్
   గరముఁ దిరస్కరించుచును, గాలము దుర్వినియోగ పుచ్చె నీ
   ధర నవివేకులౌ సుతులు తల్లుల మన్నన చేయ నేర్తురే. ౧౩౭.

తే. పరమపావని యైన యీపడఁతిగర్భ। వాసమున నిట్టిదుర్మార్గవర్తనుండు
   జనన మొందుట చూడఁ జందనవనమునఁ। బుట్టుకంటకయుత మైనచెట్టుఁ బోలె.

చ. కొడుకొనరించుదుష్క్రియలకుం బరితాపము నొందుచుండి యీ
   పడఁతి నిజాత్మజుం డిలను బావనచిత్తుఁ గల్గియుండున
   ట్లెడతెగ నట్టిభక్తిమెయి నీశ్వరుఁ బ్రార్థన చేయుచుండి యె
   య్యెడఁ దనధైర్యలక్ష్మికిని నెంతయు వన్నియఁ దెచ్చి వర్తిలెన్. ౧౩౯.

క. ధీరస్వాంత చుఁడీ యీ। నారీరత్నం బటంచు నరు లనుకొనుచున్
   గూరిమిఁ జూడఁగ నీమెకు। మారుం డాఱునెలలకును మరణము నొందెన్. ౧౪౦.

క. తనయుఁడు పరలోకమునకుఁ। జనె నని దుఃఖించెఁ గాని సతి యుల్లములో
   జనకంటకుఁ డగు నాతఁడు। చనుటయె మే లనుచుఁ దోఁచె జనతతి కెల్లన్.

తే. సహజ మగు ప్రేమచే నీమె సంతతంబుఁ। బుత్రమరణంబునకు లోనఁ బొగులుచుండ
   నతివయు గ్రశాసన మిల నందఱికినిఁ। దెలుపుటకొ యన నపనింద కలిగె సతికి.

ఆ. దుష్టుఁ డైనసుతునిఁ ద్రుంచివైచినఁ గాని। ప్రజలసౌఖ్యమునకుఁ బ్రబలహాని
   కలుగఁ బోవు ననుచుఁ గలికి తాఁ దనయునిఁ। జంపె ననుచు నింద సంభవించె.

క. భూతదయార్ద్రగుణంబున। ఖ్యాతినిఁ గన్నట్టియీమె యణుమాత్రంబున్
   బ్రీతినిఁ జూడక సుతుఁ జే। చేతనుఁ బరిమార్చె ననుట చిత్రము గాదే. ౧౪౪.

క. ఇది సత్యమొ యసత్యమొ। పదిలంబుగఁ దెలియఁగోరి పరువడిఁ గరముల్
   సదయు లగు గ్రంథకర్తలు। వెదకి తెలిసికొని రనేకవిధముల నిజమున్. ౧౪౫.

ఆ. నిజముఁ దెలిసి వారు నెలఁత నిర్దోషిణి। యనుచు వ్రాసియుండి రదియుఁ గాక
   యన్యదేశవాసి యైన మాల్కన్ దొర। వారు కూడ నిట్లు వ్రాసియుండె. ౧౪౬.



క. న్యాయమతియౌ నహల్యా। బాయి తనదుసుతునిఁ బట్టి పరిమార్చె నటం
   చీయపనింద ఘటించె న। హా యిది విన నాదుమదికి నద్భుత మయ్యెన్. ౧౪౭.

ఆ. పతియు మామ కూడఁ బరలోకవాసులై। నందులకె లతాంగి డెందమందుఁ
   జింత నొందుచుండి చిన్నికుమారునిఁ। జంపి వైచె ననుట సత్య మగునె! ౧౪౮.

ఆ. సామజంబు మొదలు దోమపర్యంతంబు। జీవజంతువులకు నేవిధంపు
   హాని చేయకుండుమా నినీతిలకంబు। సుతునిఁ జంపె ననుట చోద్య మరయ. ౧౪౯.

తే. మహి నహింసయె పరమధర్మం బటంచు। నెంచి క్రిమికీటకాదుల కించుకైనఁ
   బాధ చేసి యెఱుంగనిపరమసాధ్వి। నిజకుమారునిఁ జంపి తా నిలువఁగలదె! ౧౫౦.

ఆ. నిఖిలభూతములను నెయ్యంబుతోఁ గాంచు। నట్టియీమెపైని నట్టినింద
   మోపినట్టివారు పాపాత్ము లనవచ్చు। సందియంబు లేదు సత్యముగను. ౧౫౧.

క. అని యాంగ్లేయుఁడు వ్రాసిన। ఘనమగుసాక్ష్యంబు గలుగఁ గాంతామణి తాఁ
   దనయుని వధియింపఁగ లే। దని వేఱుగఁ జెప్ప నేల యత్యధికముగన్. ౧౫౨.

తే. ఏది యెట్లైనఁగాని యీయింతిసుతుఁడు। పరమదుర్మార్గుఁ డౌటచేఁ బ్రజలకెల్ల
   సంతత మసౌఖ్య మగుమాట సత్య మగును। గనుక నే దేవుఁ డీతని నని పె జివికి.

క. జనవాక్యము కర్తవ్యం। బనుమాట నిజంబు చేయ నాతని దేవుం
   డనిపెను బరలోకంబున। కనునటు లీకొమ్మపుత్రుఁ డపుడు గతించెన్. ౧౫౪.

క. మాలీరావు గతించిన। కాలంబున రాజ్య మేలఁ గలవారలకై
   చాలఁగ యోచించుచు జను। లీలలనగుతించి కుంది రెంతయు మదిలోన్. ౧౫౫.

సీ. ఆసమయంబునం దందలివారెల్ల నతివసూనుఁడు పోయినట్టివార్త
   పునహాకుఁ బ్రభువులై యనఘులై యున్నట్టి మాధవరావనుమహితగుణుని
   తమ్ముఁడౌ రాహోబదాదగారికిఁ దెల్పి రంతట నొకనాఁ డహల్యయొక్క
   మంత్రి తాఁ దనలోనఁ దంత్రంబుఁ జేయఁగాఁ దలఁచి వేగంబునఁ గలికికడకు
   వచ్చి యామెను గన్గొని వందనమిడి। మఱియు దుఃఖోపశమనమౌ మాటలాడి
   తనమనోభావ మెఱిఁగింపఁ దలఁచియిట్లు। విన్నవింపంగఁ దొడఁగెఁ దావినయమునను.

తే. తల్లి సద్గుణంబులపాలవల్లి వినుఁడి। తా మెఱుంగనినీతి యీధరణి లేదు
   కాన శోకాబ్ధిలోనుండి గట్టుఁ జేరి। జ్ఞానదృక్కునఁ జూడుఁ డీజగము నెల్ల. ౧౫౭.

ఉ. చూచిన సర్వసంపదలుఁ జుల్కనఁగా మదిఁ దోఁచు నెప్పుడున్
   యోచన చేయ జ్ఞానధన మర్విని శాశ్వతమై కనంబడున్
   నీచగుణుండు నాఁ బరఁగి నేర్పున జ్ఞానధనంబు దొంగిలం
   జూచెడునట్టిమోహుఁ డనుచోరునిఁ బట్టి వధింపఁ గల్గెడున్. ౧౫౮

తే. కాన నేఁడు తాము మానసంబున దుఃఖ। వహ్ని నార్పి జ్ఞానవర్షమునను
దిమధరిత్రి యేలఁ దగినవా రెవ్వరో। యరయవలయుఁజుండి యమ్మ వేగ. ౧౫౯.
క. మీ రాఁడువారు కావున। నీరాజ్యం బేల నేర రెట నైనను స
చ్చారిత్రుని గుణవంతుని। ధీరుని నొకపిల్లవానిఁ దెచ్చుకొనవలెఁ. ౧౬౦.
తే. అతఁడు పెరిఁగినదాఁక నే నధికభక్తి। రాజ్యతంత్రంబు నడిపెద రమణి యింక
కించుకైనను శంకింప కెచటనైనఁ। బిల్లవానినిఁ గొనితెండు వేగమునను. ౧౬౧.
క. అని గంగాధరశాస్త్రియె। యనుమాటల విని యహల్య యాతని మోముఁ
గని యిట్లు తెలుపఁదొడఁగెను। దనమదిలో నున్నయట్టితలఁపు నతనికిఁ. ౧౬౨.
తే. అయ్యొ దుర్భరం బైనదుఃఖాగ్నిలోనఁ। బొరలుచుండియు నెపుడు మీబోఁటివారు
కఱపుదుఃఖోపశమనవాక్యములను విని। చింతఁ దొలఁగించుచుంటి నాచిత్తమందు.
క. జరగినకార్యంబునకుఁ। మఱి మఱి దుఃఖింప నేల మన మెల్లరముఁ
ధర శాశ్వతులమె యని నా। కరయఁగ నొకధైర్య మబ్బెనయ్య మహాత్మా. ౧౬౪.
తే. సిరియు సంపద ధరణి నస్థిరములంచు। దృఢముగా నమ్మి మదిలోన దుఃఖరహిత
నగుచు ధర్మమార్గంబున నవని నేలఁ। దలఁచియున్నదానను నేనె ధన్యచరిత. ౧౬౫.
క. ఇతరులసూనునిఁ గైకొన। నతఁ డతిదుర్మార్గుఁ డగుచు ననవరతంబుఁ
క్షితిని నధర్మము నడపినఁ। గుతుకము చెడి దుఃఖమునను గుందవలసెడుఁ. ౧౬౬.
ఆ. ఏను రాజ్యమేలు టెఱుఁగకుండినయెడఁ। దప్పకుండ నొరులతనుజుఁ దెచ్చు
కొనుట యిప్పు డట్టిపనియేల నేనె యీ। రాజ్య మేలఁగలను రాణి నగుచు. ౧౬౭.
క. అని చతురోపాయంబునఁ। దనమంత్రికిఁ దెలియఁజెప్పి తరుణీమణి యా
తనిఁ బంపిన నతఁ డప్పుడు। చనె మనమునఁ గినుకఁ బూని సతిపై మిగులఁ. ౧౬౮.
క. గంగాధరయశవం తీ। సంగతి విని తనదుకోర్కి సమకూడమిచే
నంగనస్వాతంత్ర్యమునకు। భంగము కలిగింప నెంచె భావములోనఁ. ౧౬౯.
తే. తెఱవ యొకపిల్లవానినిఁ దెచ్చుకొనిన। నామె నొకచోట నుంచి యాయర్భకునకు
సాయ మొనరించునట్లుండి సంతతంబు। ధనము కైంకర్య మొనరింపఁదలఁచెమదిని.
తే. తాను జెప్పినమాటలఁ దరుణి వినని। కారణంబున మదిలోనఁ గ్రౌర్య మూని
యామె నవమానపఱుపఁ దా నాత్మ నెంచి। వడి రఘోబాకు నొకలేఖ వ్రాసె నిట్లు.
తే హొళకరువారిరాజ్యము యుక్తి మీఱఁ। బాలనముచేయువార లెవ్వారు లేమిఁ
దా మనాయాసముగ వచ్చి తత్క్షణంబ। కైకొనఁగవచ్చు నీరాజ్యగరిమ నెల్ల. ౧౭౨.
ఆ. కొమ్మ మామగారు కుగ్రామమగు హొళ। యందుఁ బుట్టి పెరిఁగినందువలన
నతనితరమువారి కందఱికిని హొళ। కరు లటన్న పేరు కలిగెఁ జుండి. ౧౭౩.
తే. అనుచు వ్రాసినయాలేఖ నతఁడు చదివి। పరమసంతోషమునఁ బొంగి పరులసొత్తు
తలఁపనితలంపుగా నబ్బెఁ దనకటంచు। యుద్ధ మొనరింప రాఘోబ యుద్యమించె.



తే. అతఁడు దుర్మార్గవర్తనుం డగుటవలన। నాసనొందుచుఁ బరరాజ్య మపహరింప
వేగఁ బయనమై వెడలెఁ దా వెలఁదితోడఁ। బోరి రాజ్యంబు గైకొని పోదమనుచు.
క. సేనలఁ గూర్చుకొని యతఁడు। మానినితోఁ బోరవచ్చుమాట నెవరో తా
మీనాతికిఁ దెలిపిన విని। తా నిలిచె సతీలలామ ధైర్యముతోడఁ. ౧౭౬.
ఆ. ధైర్యమునను జేడె తలఁగక సుంతైన। నన్నిటికిని దేవు నాత్మ నమ్మి
తెలిపె భోసలాదిదేశాధిపతులకు। సకలవృత్త మపుడె సవినయమున. ౧౭౭.
క. తనరాజ్య మొరులచేఁ గై। కొనఁబడ నున్నదని వ్రాసి గొబ్బున సతి వా
రిని వేఁడుకొనియె దీనతఁ। జను దెంచి సహాయపడుఁడి సరగున ననుచుఁ. ౧౭౮.
ఆ. కలికిపైనిఁ గల్గుగౌరవాధికతచే। రాజవర్యు లెల్ల రమణి కపుడు
సాయపడుదు మనుచు సానునయంబుగఁ। జెప్పిపంప సంతసించె వనిత. ౧౭౯.
సీ. అంతట నొక్కనాఁ డింతి తా సభచేసి భాషించె నిటు రోషభాషణములఁ
బ్రభువులౌ పేష్వాలు బ్రమసి ధనాశచే నరుదెంచి యీరాజ్య మపహరింప
వచ్చెద రని వింటి వారి కీయన్యాయ్యవర్తనం బరయంగఁ బాడియౌనె
యబల గదా యీమె నవలీల ననిలోన గెలిచెద మని వారు తలఁతురేమొ
వట్టి దామాట తమబోఁటివారి నెల్ల। నిగ్రహింపంగఁ గలను నా నేర్పుకొలఁది
సేనయును జాలఁగలదు నా చెంతఁగూడఁ। గాన నింకకై వారికే కలుగఁ గీడు. ౧౮౦.
తే. అహహ యేమని చెప్ప నయ్యవసరమున। వీరరసపూరితములైన వెలఁదిపల్కు
లందఱును విని విస్మయం బంది మదినిఁ। జూడ మింతధైర్యముగలసుదతి ననిరి. ౧౮౧.
తే. అతివపల్కినధీరవాక్యంబు లెవరొ। చెప్పఁగా వినికూడఁ దాఁ జెనఁటియగుచు
నన్న కీవార్త తెలుపక యతివపైకి। వెడలె రాఘోబ యనిచేయ వేగమునను. ౧౮౨.
తే. అదిగొ యేఁబదివేలసైన్యములతోడ। వచ్చె రాఘోబ యని చెప్ప వనిత వించు
ధైర్యకవచంబు ధరియించి తలఁకులేక। యనిపె నొకవార్త యిట్లని యతనికపుడు.
క. అయ్యా నాతో యుద్ధం। బియ్యెడఁ గావింప మీర లేతెంచితి రీ
కయ్య మొనరించుటకు నే। నియ్యకొనియె యున్నదాన నేపు దలిర్పఁ. ౧౮౪.
ఆ. ఏనుఁగూడ సేన లెన్నియో కూరిచి। యున్నదానఁ జుండు యుద్ధమునకు
గెలిచి మిమ్ము నాకుఁ గలసొత్తు దక్కించు। కొందు లవము లేదు సందియంబు. ౧౮౫.
ఆ. అట్లు నేను గెలువ నవనీశు లెల్లరుఁ। బరిహసింపఁగలరు కరము మిమ్ము
దాన మీకు మిగులఁ దలవంపు లగుఁజుండు। నాదుపల్కు నిజము మేదినీశ. ౧౮౬.
క. అటుగాక మీరు నన్నే। యటమటమున గెల్చిరేని యదియును మీ కె
న్నటికిని గీర్తి నొసంగదు। పటుతరమగు నిందయొకటి ప్రాపించుఁ జుఁడీ. ౧౮౭.
క. చెలువలతోఁ బోరుట యీ। యిలలో ధర్మంబె యరయ నేరికినైనఁ
వెలఁదుల నొప్పించినయెడఁ। గలుగదె యపకీర్తి యొట్టిఘనులకునైనఁ. ౧౮౮.

ఆ. ఆఁడువార లేదయని చేయు శేడని। తలఁతురేమొ మున్ను తరుణియైన
సత్యభామతోడ సమరంబు గావించి। యోడిపోయెఁ గాదె యొక్కయసుర. ౧౮౯.

ఉ. కావున నింతులందుఁ బొడగానఁగవచ్చెడు శౌర్యధైర్యముల్
కేవల మల్పరాండ్రనుచుఁ గీర్తికి నర్హత లేదటంచు స
ద్భావము వీడి పూరుషులు భామలఁ జుల్కన చేయఁ జూతు రీ
భూవలయంబునం దధికబుద్ధినిఁ గల్గినవార లుండరే. ౧౯౦.

ఆ. కానఁ జెలువలందుఁ గలనిరసనభావ। మునను నన్ను గెలిచి మోదమునను
బొందమనుచు మీరు బుద్ధి నెంచితిరేమొ। కాని జయము మీకుఁ గలుగఁబోదు. ౧౯౧.

క. అని వీరాలపంబుల। వనితామణి చెప్పి పంప భయకంపితుఁడై
జననాయకుండు సిగ్గునఁ। దనతలను ధరాతలంబుఁ దాఁకఁగ వంచెన్. ౧౯౨.

ఆ. లజ్జ నొంది మదిని లలనధైర్యము నీతి। ధర్మవర్తనంబు దయయు మొదలు
సర్వసుగుణములకు సంతోషమందుచుఁ। బ్రభువు సతికిఁ జెప్పి పంపె నిట్లు. ౧౯౩.

క. అమ్మా మీ కెన్నియొ క। ష్టమ్ములు గలుగుట నెఱింగి సరగున వ్యాపా
రమ్ముల నటు విడిచి యిటులు। మిమ్ములఁ గనవచ్చినాఁడ మిగుల వగచుచున్. ౧౯౪.

తే. కానఁ దమరాజ్యమెల్ల నేఁ గైకొనుటకు। వచ్చుచున్నాఁడ నని తమభావమందుఁ
దలఁపవల దని తరుణికిఁ దెలిపి పంపె। నపజయము గల్గఁ దనకని యవనివిభుఁడు.

ఆ. తరుణి కిట్లు దెలిపి తనదుసైన్యము నెల్ల। వెనుక కనిపి తాను వేగమునను
గొమ్మయున్నయెడకుఁ గూరిమితో వచ్చి। యాదరమునఁ బల్కె నామె కిట్లు. ౧౯౬.

క. తల్లీ మీ రిహసుఖములు। కల్ల లటం చెఱిఁగి ముక్తికరమై మది రం
జిల్లఁగఁ జేసెడుపరసుఖ। ముల్లంబునఁ గోరుకొనుట యుచితము సుండీ. ౧౯౭.

క. ఎక్కడిపుత్రీపుత్రకు। లెక్కడిబంధువులు మిత్రు లెక్కడివా రిం
దొక్కరు శాశ్వతు లగుదురె। మక్కువపడి చెడు టెకాక మనవారనుచున్. ౧౯౮.

క. ధర్మంబె ప్రాణబంధువు। ధర్మమె యైశ్వర్యకరము ధర్మమె సుఖముల్
ధర్మమె ముక్తికి మార్గము। ధర్మమునకు సాటి కలదె ధర నొకటైనన్. ౧౯౯.

తే. ధర్మపరతయె ముక్తికి దారి యనుచు। నిర్మలాత్మకులై చాల నీతిఁగల్గి
యీశ్వరుని నమ్మువారెపో శాశ్వతంపుఁ। బదవి నొందెడువార లీవసుధలోన. ౨౦౦.

చ. చదువుచు ధర్మశాస్త్రములు సాదరలీలను నెల్లవారికిన్
విదితముగాఁగఁ దెల్పుచు వివేకముగల్గి చరించుమార్గమున్
సదయత బీదసాదలను సత్కృపతోడుతఁ గాంచుచెప్పుడున్
ముదమున రాజ్య మేలినను మోదయుతం బగు విశ్వమంతయున్. ౨౦౧.



క. కావున జరగినదానికి। నేవిధ మగుచింత మాని యీశ్వరు నెపుడున్
భావమున నిలిపి యాతని। సేవించుచు ధర్మ మెపుడుఁ జేయుము తల్లీ. ౨౦౨.

క. ఈరాజ్యమెల్ల మీ రిఁక। ధీరతతో నేలుకొనుచు దీనుల దయతో
నారసి సంసారం బను। పారావారంబు నీఁది పారముగనుఁడీ. ౨౦౩.

తే. అనుచు వైరాగ్య ముదయింప నతివ కతఁడు। ధర్మముల నెల్ల బోధించి తత్క్షణంబ
తరలె నింమూరుపురినుండి తనదుపురికి। నంత రాజ్యంబు గైకొనె నింతి తాను. ౨౦౪.

తే. ధైర్యశౌర్యాదిగుణములఁ దనరి యుండి। తరుణి తనరాజ్య మొరులకు దక్క నీక
నేర్పుతో శత్రుసైన్యంబు నిగ్రహించెఁ। జూడఁ బోదుమె యిటువంటిసుదతి నిలను.

క. పట్టాభిషిక్తయై సతి। పట్టణ మేలుటకు రాఁగఁ బ్రజ లెల్లరు నిం
కెట్టియిడుములును మనలకుఁ। బుట్టవనుచు సంతసమునఁ బొంగిరి కరమున్. ౨౦౬.

క. పదియేడుమూర్లసైనజు। వదియైదవవత్సరమున వనితామణి తా
ముదమునఁ బీఠం బెక్కెను। సదమలులై జనము లెల్ల జయఘోష మిడన్. ౨౦౬.

క. ఇల దుర్బలులకు రాజులె। బల మను శ్రుతివాక్యసరణిఁ బ్రజ లెదలోనన్
దలఁతురు రాజులు కరుణా। కలితులు గావలయు ననుచుఁ గర మనురక్తిన్. ౨౦౭.

ఆ. కాన నీయహల్య కరుణాబ్ధి యౌట న। న్యాయ మడఁచి మిగుల న్యాయముగను
దమ్ముఁ జూచు ననుచుఁ దమలోన సంతోష। భరితు లైరి యచటిపౌరవరులు.

క. తనబంధుఁ డగుతుకోజీ। యను సద్గుణవంతు నొకని నంగన తాఁ గై
కొని మంత్రిపథ మొసంగెను। దనకుఁ దగిన మంత్రి యనుచుఁ దలఁచి మనమునన్.

సీ. మగువ తా నతని నమాత్యునిఁ గాఁ గొని కఱపె వానికి రాజకార్యసరణి
భామ నాతఁడు మాతృభావంబుతోఁ జూచి యామె చెప్పినమాట కడుగుదాఁట
కుండి నమ్రతతోడ నువిదశత్రుల పైకి దండెత్తి వారల దర్ప మడఁచి
పరరాజులను గెల్చి పడఁతిరాజ్యమునందుఁ జోరభయాదులౌ క్రూర మయిన
భయములను బాపి యుద్ధసంబంధమైన। పనుల నెఱవేర్చుచుండె నాతఁడు తాను
దక్కుఁ గలకార్యముల నెల్లఁ దరుణి తానె। నిర్వహించుచు నుండెను నేర్పుతోడ.

తే. ప్రాణనాథునిఁ బుత్రునిఁ బనిచి దివికిఁ। దగుదు నని పీఠ మెక్కి తా ధరణి నేల
నకట నావంటిక్రూరురా లవనిఁ గలదె। యనుమతోఁ జేసె నాగుండె నీశ్వరుండు.

ఆ. అనుచు నీమె వగవ నాసమయంబున। సతికి లోన నెవరొ సదయు లగుచుఁ
బల్కినట్లు తోఁచెఁ బరమ సుజ్ఞానంపుఁ। బలుకు లిట్లు వినఁడి ప్రమదమునను.

క. ఏటికె చింతిల మగువా। కాటికిఁ బోనట్టివారు గలరె ధరిత్రిన్
మాటికి నరయఁగ మానవ। కోటికిఁ దప్పనిది కాదె మూలుట ధరణిన్. ౨౧౪.

క. కావున నైసర్గిక మగు। చావున కెదలోనఁ గుంది సంతతమును నీ
వీవిధమున నుండిన నినుఁ। గేవల మవివేకిని యని కృతమతు లనరే. ౨౧౫.

ఉ. చచ్చినవారి కేడువక చాలవివేకము గల్గి మానవుల్
నిచ్చలు ధర్మమార్గమున నేర్పరులై తగ సంచరించి తా
మెచ్చుట కెట్టు లుండినను నీశ్వరు నమ్మి భజింప వారిని
మెచ్చుదు రెల్లవారలును మే లొనఁగూర్చును దేవదేవుఁడున్. ౨౧౬.

క. చచ్చినసుతుఁ డొక్కఁడె నీ। కెచ్చోటను గన్న సూను లెందఱొ కల రీ
పిచ్చిని విడి వడి సమతను। గ్రచ్చఱ నిలజనులఁ జూడఁ గాఁ దగు మగువా. ౨౧౭.

క. అని పల్కినపల్కులఁ దా। విని విస్మయ మంది మది వివేచించి తుదన్
దనయంతర్వాణి యిటులు। వినిపించెఁ గదా యటంచు వెలఁది యెటంగెన్. ౨౧౮.

ఆ. తెలిసి యంతరాత్మ తెలిపినవిధ మెల్ల। సత్య మనుచు నమ్మి స్వామి నెపుడుఁ
జిత్తమందు నిల్పి చెలువ స్వకృత్యముల్। నిర్వహింపఁ దొడఁగె నీతిరతిని. ౨౧౯.

సీ. పొలఁతి సూర్యోదయంబునకుఁ బూర్వమె లేచి మును కాల్యకరణీయములను జరపి
యంత స్నానము చేసి యధికభక్తిని దేవతార్చనం బొనరించి యాత్మయందు
సకలలోకాధారు సర్వజ్ఞు సర్వేశు భక్తమందారు విపద్విదారుఁ
బాయకుండఁగ నిల్పి భక్తితో బహువిధసాధనంబులచేత జపము చేసి
షడ్రసోపేత మైనభోజనము చేసి। పిదపఁ బండితోత్తములను బిలువనంపి
భక్తిరసపూరితము లైనపద్యములను। వివిధధర్మముల్ వారిచే వినును బ్రీతి. ౨౨౦.

ఆ. ప్రాలుమాల కెపుడుఁ బడఁతి తాఁ దలఁచిన। దెట్టికార్య మైనఁ బట్టుదలను
జేసి కాని నిద్రఁ జెంద కుండును జుండి। నీతి సోమరులకు నేర్పు ననఁగ. ౨౨౧.

క. తనజాతి మాంసభక్షణ।మున కెడ మిచ్చునది యైన ముద్దియ తిన ద
య్యెను మాంసం బెన్నఁడుఁ దా। ఘనవిప్రాంగనను బోలి కడు శుచితమెయిన్.

క. తనవిభుఁడు చన్న వెనుకను। దనయాభరణంబు లెపుడు ధరియింపక తె
ల్లనివస్త్రమును ధరించుచు। వనితామణి జరుపుచుండె వైధవ్యదశన్. ౨౨౩.

సీ. కలికి నిత్యము రెండుగంటలవేళను రాజకార్యము దీర్ప రాజసభకు
నరుదెంచి యందు నన్యాయంబు లేకుండఁ బ్రజలకలహములఁ బాపి దయను
స్వయముగా రాజ్యసంబంధమౌ పను లెల్ల నెఱవేర్చుకొని వచ్చి నిలయమునకు
మగుడ సాయంకాల మగుడు నీశ్వరుఁ గొల్చి యతనిప్రసాదంబు నంది పిదపఁ
దుది ఫలాహార మొనరించి నిదురఁ బోవు। రెండుజాములరాత్రికి నిండుమదినిఁ
గాల మీరీతిని వృథాగఁ గడప కెపుడు। సార్థక మొనర్చె మానవజన్మ మహహా.



తే. రమణి బ్రాహ్మణస్త్రీవలె రాత్రులందు। నన్నము భుజించుటను మాని యెన్నరాని
వ్రతము లొనరించుచుండె సద్భక్తితోడ। విప్రవర్యుల రక్షించె విపులముగను.

సీ. అమలమౌ సద్బుద్ధు లన్నిటి కన్నను దానశీలతయును దయయు సతికి
నధిక మైనందున నంగనామణి యన్నదానంబులును వస్త్రదానములును
సకలదానంబులు సత్పాత్రులను జూచి చేయుచు సత్కీర్తిఁ జెందుచుండెఁ
బలుక్షేత్రములు గల భరతఖండమునందుఁ గావించె దేవతాకార్యములను
బ్రాఁతదేవాలయములను బాగుపఱిచి। దేవతాక్షేత్రములయందు దివ్య మైన
తనదునామంబు జను లెల్లఁ దలఁచునట్లు। లేదియో యొకతనచిహ్న మేరుపఱిచె.

చ. చదువుల కుప్పకుప్పయనుచుఁ జాల నుతింగను వారణాసిలో
సదయుఁడు విశ్వనాథుఁ డనుసామి వసించెడియాలయంబు నీ
ముదితయె కట్టి యిచ్చె నని ముద్దియసచ్చరితంబులన్ జగ
ద్విదితము గాఁగ వ్రాసిరి కవీశ్వరు లీమె నుతించు చెంతయున్. ౨౨౭.

క. అన్నాతురులకు నీయమ। యన్నముఁ బెట్టింపఁ దలఁచి యాదరమునఁ దా
నన్నము నిడుసత్రంబుల। నెన్నియొ కట్టించి మించె హెచ్చినకీర్తిన్. ౨౨౮.

ఆ. తరుణి దీనజనుల దయఁ జూచుటే కాక। పశువు పక్షి మొదలు బహువిధంపు
జంతుకోట్ల కెల్ల సంతతంబు ననంత। మైనమే లొనర్చె నధికదయను. ౨౨౯.

తే. పక్షు లరుదెంచి పొలములపైని వ్రాలఁ। గాంచి కఠినాత్ము లైనట్టికాఁపువాండ్రు
రాళ్ళతోఁ గొట్టుటను జూచి రమణి మిగులఁ। దల్లడం బొంది మదిలోనఁ దలఁచె నిట్లు.

ఉ. ఎంతదయావిహీను లని యెన్నఁగ వచ్చును వీరి నయ్యయో
యింతయు జాలి లేక తమకూరతఁ బక్షులపైనిఁ జూపి నొ
ప్పింతురు జీవజంతువులఁ బ్రీతిని జూడక మూఢచిత్తులై
యింతట నైన వీనిశ్రమ లెల్ల నివారణ మేను జేసెదన్. ౨౩౧.

క. అని తలఁచి పంటచేలను। గొని పులుఁగులకొఱకు విడిచెఁ గోమలి దయ యీ
వనితామణియై పుట్టెనొ। యని సంశయ మంది లోకు లద్భుత మందన్. ౨౩౨.

క. నోరెఱుఁగనిపక్షులఁ గని। నారీమణి జాలి నొందినదియై వానిన్
గూరిమి నరసె నహా సతి। నేరీతి నుతింపఁ దగునో యే నెఱుఁగఁ జుఁడీ. ౨౩౩.

క. కనిపించును వినియు నెఱుంగము। మును పక్షులకొఱకు ధాన్యము నొసఁగి దయ వా
నిని బ్రోచినవార్త నిదే। విన గలిగినవార మీ మెవిమలచరిత్రన్. ౨౩౪.

ఆ. పడఁతి యాఱుకోట్లపై మూడులక్షల। ధనము గల్గియుండి తనదుమదిని
గర్వ మెఱుఁగ కెపుడుఁ గడునేర్పు గల్గి తద్ధనమువలనఁ బుణ్యధనముఁ బెంచె.

క. సతి యెయ్యది నిజమని తన। మతి నమ్మెనొ దాని నెల్ల మానక యెపుడు
న్నతకృత్యముల నొనర్చుచు। సతతము సద్గోష్ఠి గల్గి సన్నుతి కెక్కెన్. ౨౩౬.

క. వనితామణి దయ నిరతముఁ। దనదుశిరోభూషణముగఁ దాల్చినదై తా
ఘనకార్యము లొనరించెను। దనవర్తన మెరులు నేర్పఁ దగియుండునటుల్. ౨౩౭.

సీ. దయ కన్కపట్టుగాఁ దాఁ గానిపించియు నుగ్రశాసన యయ్యె నువిద మిగులఁ
దనసేవకావళి తనయాజ్ఞ మీఱుచుఁ దప్పు చేసినయెడ దయఁ దలఁపక
ఘోరశిక్ష విధించి వార లెప్పుడుఁ దప్పుదారిఁ బోవక యుండ దండనంబుఁ
జేసి వారికి మేలు చేయఁ దలంచుచు భయభక్తులను జూపి బాగు పఱచి
బందిపోటు లొనర్చెడువారిఁ జూచి। మీకు నన్నపానాదులు లేక యున్న
నిచ్చెదను బీళ్ళఁ గొన్నిటి నిపుడు మీకుఁ। గైకొనుండని పల్కును గలికి దయను.

ఆ. మఱియు వారి కిట్లు మగువ యాజ్ఞాపించెఁ। బ్రజల మోసపుచ్చి బందిపోట్లు
చేయకుండి మఱియుఁ జేయువారలలోనఁ। జేర మనుచు బాస చేయుఁ డీరు.

క. వేయేల రాజ్యమందున। నీయమ పాలించునప్పు డేవిధమగు న
న్యాయము జరుగమి జను లా।పాయము గని యుండి రెదలఁ బ్రమదం బొప్పన్.

క. అంతటఁ గొన్ని దినంబుల। కింతికిఁ గలసుగుణజాల మెల్లెడఁ దెలియన్
సంతస మందుచు నొకకవి। కాంతామణిఁ గూర్చి యొక్క కావ్యము చేసెన్.

తే. కావ్యమును దీసికొని వచ్చి కవివరుండు। చేడె కర్పించి లాభంబుఁ జెందఁ దలఁచి
నెలఁతకడ వచ్చి నిలిచి వినీతితోడఁ। గరయుగంబులు మోడ్చి తాఁ బరమభక్తి.

ఉ. అమ్మ మిము న్నుతించుటకు నర్హతఁ జాలనివాఁడ నయ్యు లో
కమ్మున మీప్రవర్తనము గణ్యత నొందుటఁ గాంచి నాదుచి
త్తమ్మున మీగుణావళినిఁ దప్పక సంస్మరణంబుఁ జేయఁ బా
పమ్ములు నాశమా ననుచు వ్రాసితిఁ జెండి భవచ్చరిత్రమున్. ౨౪౩.

క. అని పల్కి కావ్య మొసఁగిన। వనితామణి స్తుతులఁ జదివి బహుకోపముతో
ననుఁ బొగడఁ దగదు నీ వా।ఘనుఁ డగుపరమాత్ముఁ బొగడు కడుభక్తి మెయిన్.

శా. అయ్యా నీ విటు సన్నుతింపఁ దగ దే నల్పజ్ఞురాలం జుమీ
నెయ్యం బొప్పఁగ సర్వకారణికునిన్ నీచిత్తమం దుంచి నీ
వెయ్యేరీతుల నాతనిం దలఁప నీయిష్టంబు చేకూఱునో
యయ్యారీతుల నాతనిన్ బొగడి నిత్యానందముం బొందుమీ. ౨౪౫.

క. సకలాధారుండై భువి। సకలముఁ బుట్టించి పెంచి సమయించెడు న
వ్యాకలంకు నొకనిమాత్రమె। యకుటిలమతి సన్నుతింప నగు నెల్లరకున్. ౨౪౬.



తే. కాన సుజ్ఞాని వగుచు నోకవివరేణ్య। సకలసద్గుణజాలుండు సర్వసాక్షి
యమలవిజ్ఞానమూర్తి యాద్యంతశూన్యుఁ। డైనసామి నుతింపుమా యధికభక్తి.

క. ఆతనిఁ గొనియాడిన నీ। పాతకములు తొలఁగు జన్మపావన మగు వి
ఖ్యాతి లభించును సుగుణ। వ్రాతము నినుఁ బాయకుండు భయము నశించున్.

క. ధర నవివేకు లెఱుంగరు। పరమాత్ము నుతింపఁ గల్గుపరమానందం
బరయఁ బరార్థపరుల్ సు।స్థిరమతులై వెలయుధర్మశీలురు దక్కన్. ౨౪౯.

క. అని పల్కి యాతఁ డొసఁగిన। తనపైని రచింపఁబడినతత్కావ్యంబున్
గొని నదిలోఁ బడ వైచెను। వనితామణి యీమె పరమపావని కాదే. ౨౫౦.

క. స్తుతిపాఠంబుల కెన్నఁడు। మతి నుప్పొంగెడుగుణంబు మానినియొద్దన్
వెతకినఁ గనఁబడనందున। సతిధన ముపయోగపడియె సత్పాత్రములన్. ౨౫౧.

క. తనరాజ్యమందు నిర్వురు। వనితలు తమనందనులును బ్రాణేశ్వరులున్
జనిపోవుకతనఁ దమధన।మును దన కియ్యంగఁ జూచి ముద్దియ పల్కెన్. ౨౫౨.

తే. ఏల నా కొసంగితి రిప్పు డీధనంబుఁ। గారణము దెల్పుఁ డన విని వారు భక్తి
నతివకడ నిల్చి ముకుళితహస్తలగుచు। విన్నవింపంగఁ దొడఁగిరి వెలఁది కిట్లు. ౨౫౩.

తే. అమ్మ మాయొద్దఁగల ధన మనుభవింప। నెవ్వరును లేరు కావున నీధనంబు
మీరు కైకొండు వేగంబ మేముపోయి। వారణాసిని నివసియించువార మిఁకను.

తే. పుత్రులను వల్లభులను గోల్పోయి యిచట। నొంటరిగ నుండఁజాల మోయువిద వేగ
కాశికాపురిఁ జేరి నిష్కలుషమూర్తి। యైనవిశ్వేశ్వరునిఁ గొల్తు మచటనుండి. ౨౫౫.

తే. అమ్మ యీధనం బెల్ల మీయనుపమాన।మైన కరుణాతిశయముచే నబ్బె మాకుఁ
గాన మీసొత్తె మీరలే కరుణతోడఁ। గైకొనుఁడు పోయెదము మేము కాశి కిపుడు.

ఆ. అనుచు వారు పల్క నంగనామణి వారిఁ। బరమకరుణఁ జూచి పలికె నిట్లు
సంతసంబు గల్గె సతులార మీ రిప్పు।డాదిదేవుఁ గొల్తు మనుట నాకు. ౨౫౭.

క. కాని పరమాత్మ మీరలు। ధ్యానించుటకొఱకు దూర మగుపురమునకున్
బో నేల జగము నిండిన। వానిని వెదకుచును గ్రుడ్డివారలభంగిన్. ౨౫౮.

క. సర్వవ్యాపకుఁడై భువి। సర్వంబున నిండియుండు సర్వేశుఁడు తా
సర్వము శాశ్వతమని యెడు। గర్వమువిడి కొలువ నతఁడు గరుణించుఁజుండీ. ౨౫౯.

క. మును ప్రహ్లాదునిఁ బ్రోవను। ఘనుఁ డగుభగవంతుఁ డుక్కకంబమునందున్
జననంబై నరసింహుం। డను పేరిటఁ గ్రుంపలేదె యాతనితండ్రిన్. ౨౬౦.

క. ఈయితిహాసము చాలదె। పాయనికృపతోడ స్వామి భక్తుల కెపుడున్
సాయ మొనర్చుచు నెల్లెడఁ। బాయక నివసించియుండువాఁ డని చాటన్. ౨౬౧.

తే. పరమమూర్ఖులకొఱకునై ధరణి మున్ను। తీర్థయాత్ర లేర్పఱచిరి ధీరవరులు
గాని సుజ్ఞాన మెఱుఁగనికపటచిత్తు। లెటకుఁబోయిన సర్వేశు నెఱుఁగలేరు. ౨౬౨

క. తమలోనిశత్రుగణముల। విమలమతిం ద్రుంచి సర్వవిధధర్మములన్
గ్రమముగ జరిపెడు మనుజులు। దమలోఁ గనఁగలరు మోక్షదాయకు నెపుడున్.

తే. కాన మీ రిప్పు డలకాశికాపురికిని। నేగ నావశ్యకంబు లే దీశ్వరుండు
సర్వగతుఁడై సుసూక్ష్ముఁడై సర్వసాక్షి। యగుచు వెలుఁగొందుఁగానమీయాత్మయందు.

తే. మీపతులు సంగ్రహించినమీధనంబు। నేను గైకొన నేర్తునే నీతి మాలి
పట్టియన్యాయ మిది నాకు వలదు ధనము। గైకొనుఁడు పొందు మీయిండ్లకడకు వేగ.

ఆ. ధనముతోడ మీకుఁ బనిలేకయున్నను। ప్రాణనాథు లైనవారిపేరు
ధరణి నిల్చునట్లు ధర్మకార్యంబులఁ। జేసి కీర్తిఁ గనుఁడి శీఘ్రముగను. ౨౬౬

ఆ. అనుచుఁ జెప్పి వారి నంపినైచె నహల్య।పరులసొత్తు గడ్డిపఱకవలెను
జూడవలయు ననెడుసూజ్ఞాన మెఱిఁగిన। వెలఁది యాటఁ జేసె వేగమునను. ౨౬౭

సీ. ఈరీతిని నహల్య యెల్లసద్గుణముల కాటపట్టగుచుఁ దా ననవరతముఁ
దనరాజ్యమం దుండుజనుల కేబాధలు లేకుండఁ జూచు చనేకమైన
పుణ్యకార్యంబులఁ బుడమిపై నొనరించి నిఖిలాపదబ్ధుల నిస్తరించి
సర్వేశ్వరుని సదా సంస్మరించుచునుండి యఖిలంబు నాతనియాజ్ఞ యనుచుఁ
బరమభార్మికురాలయి పరఁగుతఱిని। బడఁతియల్లుండు పరలోకవాసుఁ డయ్యె
నట్టిదుర్వార్తవించుఁ దానాక్షణంబ। కూఁతుఁ గనఁబోయె దుఃఖాగ్నిఁ గుమిలి మదిని.

తే. పోయి పుత్రికామణిఁ జూచి పొలఁతి తాను। జింతచే నోట మాట వచింప లేక
కొంతవడి నేదదేఱి తాఁ గూఁతుఁ గాంచి। పలికె దుఃఖోపశమనమాపలుకు లిట్లు.

తే. తల్లి దుఃఖింప నేల యీధరణియందుఁ।బుట్టి సర్వంబుఁ బదపడి గిట్టుటయును
భగవదాజ్ఞ యటం చని భావమందుఁ। దలఁచి ధైర్యంబునొందుట దగును మనకు.

క. ఎన్నిదినంబులు వగచిన। నెన్నఁడు రాఁబోరు దివికి నేఁగినవారల్
చిన్నికుమారి ప్రపంచం। బెన్నఁగ నాటక మటంచు నెఱుఁగుము తెలివిన్. ౨౭౧

క. అని జనని యాదరించిన। విని ముక్తాబాయి మిగుల వినయముతోడన్
జననిని గనుఁగొని యిట్లనెఁ। గనుదోయిని జలము నింపి కడుదుఃఖితయై. ౨౭౨

క. ప్రాణసమానుఁడగు నిజ।ప్రాణేశునిఁ బాసి యిలను బ్రతుకుటకన్నన్
బ్రాణేశునితో నేఁగుట।యేణాక్షికి ధర్మ మనుట నెఱుఁగవె తల్లీ. ౨౭౩

తే. అనుడు గుండె జల్లనియె నహల్యకపుడు। కంప మొందెను దేహంబు గాళ్ళువడఁకె
మనసు వికలత నొందఁగ మగువ మరలఁ। దనయ నీక్షించి పల్కెను దైన్యమునను.



చ. తనయ భవద్వియోగశిఖి తప్పక నాహృదయంబుఁ జేరి నా
తనువు దహింపఁజేయు నిఁక మానుము నీవిభుతోడ నేఁగుటన్
జనని యభీష్టము న్మిగుల సమ్మతిఁ దీర్చుటయు న్మహీస్థలిన్
ఘనమగుధర్మమే యగును గావున న న్గరుణింపు మిత్తఱిన్. ౨౭౪

క. నినుఁ జూచి దుఃఖమెల్లను। దునుమాడితి నీవు గూడఁ దొలఁగెద వన్నన్
మనసు నిలుపఁగ వశంబే।తనయా నను విడిచిపోవఁ దగునే నీకున్. ౨౭౫

ఆ. అనుచుఁ దల్లి పల్కె నాత్మజ యిట్లనె। వినుము మాత నాదువిన్నపంబు
మును జనకుఁడు భ్రాతయునుబోయె రిప్పుడు।పతియుఁగూడఁబోయెఁ బరమునకును.

తే. ఒకతనూజుఁడు గల్గియు నకట యాతఁ। డరిగె లోకాంతరంబున కమ్మ వినుమి
యిందఱిని గోలుపోయి నే నిలను బ్రతికి। సార్థకత యేమి నొప్పుమా సత్యముగను.

ఆ. తల్లి నిన్నుఁ జూచి ధరణి నుండెదనన్న। నఱువదేండ్ల ప్రాయ మరిగె నీకు
నీవు చన్నవెనుక నెయ్యంబుతో నన్ను। నరయువార లెవ్వ రవనిలోన. ౨౭౮

తే. కరుణఁ జూచెడువార లెవ్వరును లేమి। గౌరవముతోడ బ్రతుకుట కష్టతరము
గౌరవము చెడ్డవెనుక నిక్కము జనులకు। నాత్మహత్యయె మేలుపో యరసిచూడ.

క. కావున నే సహగమనము। గావింపఁ దలంచియుంటిఁ గరుణను నీ వో
పావని ననుఁ గృపఁ గని యా।దేవుఁడు రక్షించునట్లు దీవింపు తగన్. ౨౮౦

క. అని చెప్పి తనదుజననికిఁ। జని ముక్తాబాయి ప్రాణసముఁ డగుపతితో
నొనరించి సహగమనముఁ దా। జననిని దుఃఖాబ్ధిలోన సరగున ముంచెన్. ౨౮౧

క. ముద్దులసుత చనె నని యే। ప్రొద్దును జింతించి లోనఁ బొగులుచునుండన్
ముద్దియదేహంబున రుజ।తద్దయు బాధించె నట్టితఱి నయ్యయయో. ౨౮౩

క. ఎన్నఁగఁ జాలనియాపద।లెన్నియొ గుమిగూడి వచ్చి యీయమధృతినిన్
గ్రన్నన హరియింపఁగఁ దా। నన్నియుఁ బరిమార్చె ధైర్య మనుఖడ్గమునన్. ౨౮౪

సీ. ఇట్లంగి ముప్పదియేఁడు లీయమ రాజ్యపరిపాలనముఁ జేసి ప్రజలవలన
నతివ విశుద్ధపుణ్యశ్లోక యనియెడుగౌరవాధిక్యంబు గాంచుచుండి
వసుధలో నన్యాయ్య వర్తను లగురాజు లందఱుఁ గని సిగ్గు నొందునట్టు
లిల నేలి యన్యాయ మెట్టిదో యెఱుఁగక సత్కీర్తిఁ గాంచుచు సంతతంబు
నింతు లెల్లరుఁ దమలోన నిట్టివనిత। వెలసె తమజాతివారిఁ బవిత్రపఱిచె
ననుచు గర్వంబు నొందున ట్లనవరతము। మెలఁగుచుండంగఁ జావు సమీపమయ్యె.

ఆ. పదియు నేడునూర్లపైఁ దొంబదేనవ।యబ్దమున నహల్య నకట మృత్యు
వపహరించె లోకు లందఱుఁ దమపెన్ని।ధాన మఱిగినట్లు తల్లడిల్ల. ౨౮౫

క. దేవగుణంబు లనేకము। లీవనితకుఁ గల్గియుండు టెల్లరు గని యా,
పావని జగదంబయె తా। నీవిధమున నవతరించె నిల నని రెందుర్. ౨౭.

ఆ. అంబ లోకమాత యవతారమై భువి। నేఁడు మనల విడిచి నిర్మల మగు
తనదులోకమునకుఁ దరలె నం చని రంత। చెలువకీర్తి వేఱ చెప్ప నేల? ౨౮.

క. అంతట నొకయాలయమున। సంతసమున నీమె ప్రతిమ స్థాపించి తగన్
సంతతము మహారాష్ట్రు ల। రెంతయు భక్తిని భజించి రేమని చెపుదున్. ౨౯.

క. ఎందఱో రాజులు గల రా। యిందూరుపురంబు దొల్లి యేలినవారల్
సుందరివలె సత్కీర్తిని।బొందినవా రొకరు లేరు బుద్ధిఁ దలంపన్. ౩౦.

తే. అబలయై పుట్టి యీయమ యవని యెల్ల।నింత•ధర్మంబుతో నేలి యిన్ని సుగుణ
జాలములఁ గల్గియుండుట సత్యమగునె। యతిశయోక్తులు గా కని యందు రేమొ.

ఆ. అట్లు దలఁపఁ గూడ దణుమాత్రమైనను। సతి సుశీల యగుట సత్యమగును
దరుణియర్హతకును తగురీతి వర్ణింప। లేమిఁ జింత గల్గె నామనమున. ౩౨.

క. వనిత యయి పుట్టి యీసతి। ఘనత వహించినది కానఁ గాంతలపైనిన్
మనగ్రంథము లారోపిం।చిననింద లసత్య మని వచింపం దగుఁగా. ౩౩.

ఉత్సాహము. కొమ్మ యాటె కాక గొల్లకులమునందుఁ బుట్టియున్
నెమ్మనమున దేవదేవు నిల్పి భక్తిఁ గొల్చి దో
షమ్ము లంట కుండఁ గాంచె సర్వసద్గుణావళిన్
సమ్మదమునఁ జదువుఁ డీమెసచ్చరిత్రఁ జేడియల్. ౩౪.

మత్తకోకిల. కూర్మితోడుతఁ జద్వి మీరలు కొమ్మరీతిని సర్వదు
ష్కర్మముల్ దెగటార్చి యెప్పుడు సత్యవాక్యము లాడుచున్
ధర్మమార్గమునం జరించుచు దైవము న్మది నిల్పుఁ డీ
నిర్మలుం డగుస్వామి మీ కిల నిత్యసౌఖ్య మొసంగెడున్. ౩౫.



